

# ప్రహ్లాదుడు

బ్రహ్మ మానస పుత్రులైన సనకసనందనాదులు మూడు లోకాలూ తిరుగుతూ ఒకనాడు తలవని తలంపుగా విష్ణు లోకానికి వెళ్ళారు. అయిదేళ్ళ పిల్లల లాగా, దిగంబరులై ఉన్న ఆ వృద్ధ మహామునులను చూసి విష్ణువు యొక్క ద్వారపాలకులైన జయ విజయులు అడ్డగించి, లోపలికి పోనిచ్చారు కారు. దానికి అలిగి ఆ మునులు ద్వారపాలకులను రాక్షస జన్మ లెత్తమని శపించారు.

శాపానికి భయపడి జయవిజయులు శాప మోక్షణం దయచెయ్యమని మునులను వేడుకున్నారు. మూడు జన్మల అనంతరం వారికి తిరిగి విష్ణులోక ప్రాప్తి కలిగేటట్టుగా అనుగ్రహించి మునులు తమ దారిన తాము వెళ్ళారు. ఆ శాపం ఫలితంగా వారు మొదటి జన్మలో కశ్యపుడికి దితి గర్భాన హిరణ్యకశిపు హిరణ్యాక్షులై జన్మ ఎత్తారు.

హిరణ్యాక్షుడు యుద్ధాసక్తి గల వాడు. తనతో యుద్ధం చేయమని అతను వరుణుణ్ణీ ఇంకా ఇతరులనూ పిలిచాడు. కాని ఎవరూ అందుకు సిద్ధ పడలేదు. అతను భూమిని చుట్టి పాతాళంలో పడేసినప్పుడు విష్ణువు యజ్ఞ వరాహావతారమెత్తి భూమిని పైకి తెచ్చాడు. హిరణ్యాక్షుడా వరాహంతో తలపడి, యుద్ధం చేసి చచ్చాడు.

విష్ణువు తన తమ్ముణ్ణి చంపినందుకు హిరణ్యకశిపుడికి పట్టరాని కోపం వచ్చింది. అతను సభలో దానవ వీరుల నుద్దేశించి కోపాతిరేకంతో మాట్లాడుతూ, "మాయా రూపంలో వచ్చి నా తమ్ముణ్ణి చంపిన ఆ విష్ణువును నా శూలానికి గుచ్చి, అతడి రక్తంతో నా తమ్ముడికి తర్పణం చేస్తాను. ఈ లోపల మీరు ప్రపంచ మంతటా తిరిగి తపస్సూ, యజ్ఞాలూ, వేదాధ్యయనమూ, వ్రతాలూ, దానాలూ చేసే వారి నందరినీ

అట్ట చివరి బొమ్మ

చంపండి. గోబ్రాహ్మణ పూజలూ, వర్ణాశ్రమ విధులూ సక్రమంగా సాగే గ్రామాలన్నిటినీ తగలబెట్టండి,'' అని హెచ్చరించాడు.

రాక్షసులు విజృంభించి సంచరిస్తూ ప్రజల పైన పడి హత్యాకాండ సాగించారు. పురాలనూ, గ్రామాలనూ, రాజధానులనూ, మందలనూ, తోటలనూ, పొలాలనూ, ఆశ్రమాలనూ విధ్వంసం చేశారు.

హిరణ్యకశిపుడు చచ్చిన తమ్ముడికి ఉత్తరక్రియలు చేసి, తన తల్లినీ, తమ్ముడి భార్యనూ, కొడుకులనూ ఊరడించి, తనకు అపజయం గాని, ముసలితనం గాని, చావు గాని లేకుండా చేసుకుని, లోకాలన్నిటికీ తానే రాజు కావాలన్న కాంక్షతో తపస్సు చేయబోయాడు.

అతను మందరగిరి యొక్క లోయలో కాలి బొటనవేలిపై నిలబడి, చేతులు పైకెత్తి పరమ దారుణమైన తపస్సు చేశాడు. అతని శరీరం యొక్క వేడి అన్ని లోకాలకూ వ్యాపించింది. సముద్రాలు ఘోషించాయి. భూమి కంపించింది.

దేవతలు హిరణ్యకశిపుడి తపశ్శక్తికి తట్టుకోలేక బ్రహ్మ లోకానికి వంగి త్తిపోయి, హిరణ్యకశిపుడి తపస్సు ఏదోవిధంగా నిలుపు చెయ్యమని బ్రహ్మను వేడుకున్నారు. అందుకు బ్రహ్మ సమ్మతించాడు.



బ్రహ్మ వెళ్ళి చూసేసరికి హిరణ్యకశిపు ఎక్కడ ఉన్నదీ కూడా తెలియరాలేదు. అతని చుట్టూ పుట్ట పెరిగింది. దాన్నిండా గడ్డి, వెదురుదుబ్బులూ ఉన్నాయి. హిరణ్య కశిపుడి శరీరాన్ని చీమలు తినేశాయి. బ్రహ్మ అతని స్థితిచూసి ఆశ్చర్యపడి, "హిరణ్యకశిపూ, నీ తపస్సు ఫలించింది, లేచిరా! నీ కేం వరం కావాలో కోరుకో!" అంటూ తన కమండల జలం హిరణ్యక శిపుడి శరీరం పైన చల్లారు.

వెంటనే హిరణ్యకశిపుడు బంగారంలాగా వెలిగిపోతున్న శరీరంతో, యౌవనంతో నిండినవాడై పుట్టలో నుంచి పైకి వచ్చాడు. అతను హంస వాహనం ఎక్కి ఆకాశంలో కనిపించే బ్రహ్మకు సాష్టాంగ నమస్కారం చేసి, స్తుతించి, "నేను కోరిన వర మివ్వ దలిస్తే, నీవు సృష్టించిన భూతాలలో దేని వల్లా నాకు చావు లేకుండా వరమియ్యి. లోపలగాని, వెలపలగాని, రాత్రిగాని, పగలు గాని, భూమిపైగాని, ఆకాశంలోగాని, నీవు సృష్టించని వాటి చేతగాని, ఆయుధాల చేత గాని, మానవులచేతగాని, ప్రాణం లేని వాటి చేతగాని, ప్రాణంగల వాటి చేతగాని, సురాసురుల చేతగాని, మహోరగుల చేతగాని నాకు చావు లేకుండానూ, యుద్ధంలో నాకు అపజయం లేకుండానూ, రాజరికంలో



నాకు ఎదురు లేకుండానూ, దేవతల కుండే అష్ట ఐశ్వర్యాలూ నా కుండేటట్టూ వర మియ్యి," అని వేడుకున్నాడు.

బ్రహ్మ హిరణ్యకశిపుడికి అతను కోరిన వరాలన్నీ ఇచ్చి తన లోకానికి తిరిగి వెళ్ళిపోయాడు.

బ్రహ్మ నుంచి అపూర్వమైన వరాలు పొంది, శరీరం బంగారు రంగులో మెరిసి పోతూ, తన తమ్ముడి చావుకు కారకుడైన విష్ణుని ద్వేషిస్తూ అతను త్రిలోక దిగ్విజయానికి పూనుకున్నాడు. దేవ, రాక్షస, మనుష్య, గంధర్వ, గరుడ, ఉరగ, సిద్ధ, చారణ, విద్యాధర, యక్ష, రాక్షస, భూత, ప్రేత గణ రాజులూ, ఋషులూ, మునులూ అతనికి వశులయారు. విశ్వకర్మ నిర్మించిన స్వర్గం అతనికి నిలయమయింది. లోక పాలకు లతనికి పాదవందనాలు చేశారు, సిద్ధ గంధర్వ విద్యాధరాప్సరసలు అతని ముందు నృత్యాలు చేశారు.

విశ్వావసు తుంబుర నారదులు అతని కీర్తిని గానం చేశారు. భూమ్యాకాశాలూ, నదులూ, సప్త సముద్రాలూ, అతని ఆజ్ఞ ప్రకారం నడుచుకున్నాయి.

ఒక్క త్రిమూర్తులు తప్ప అతని ఆజ్ఞకు లోబడని వారు లేరు.

దిక్పాలకులు మొదలైన వారు దిక్కు తెలియక విష్ణుమూర్తిని శరణుజొచ్చారు. వారి మొర ఆలకించిన హరి అశరీరవాణి రూపంలో, "భయపడకండి. కొంచెం ఓపిక పట్టండి. ఆ రాక్షసుడి సంగతి నాకు తెలుసు. నేను వాడి మదం అణగిస్తాను. వాడు తన కొడుకైన ప్రహ్లాదుణ్ణి హింసించే టప్పుడు, బ్రహ్మ ఇచ్చిన వరాలకేమీ భంగం కలగకుండా నేను వాణ్ణి చంపేస్తాను," అని అభయం ఇచ్చాడు.

విష్ణువు చెప్పిన ఈ మాటలకు తృప్తి పడి దేవతలు తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. —(ఇంకావుంది)





# ప్రహ్లాదుడు

## 2

హిరణ్యకశిపుడు తపస్సు చేయబోయే సమయానికి అతని భార్య లీలావతి గర్భవతి. ఆ సమయంలోనే ఇంద్రుడు విజృంభించి రాక్షసుల పై యుద్ధంచేసి ఓడించి, లీలావతిని పట్టుకున్నాడు.

అప్పుడు నారదుడు వచ్చి ఇంద్రుడితో, "ఈమె పరమసాధ్వి, మహాపతివ్రత. ఈమె నెందుకు పట్టుకున్నావు? విడిచి పెట్టు," అని చెప్పాడు.

"ఈమె గర్భాన కొడుకున్నాడు. వాణ్ణి చంపి ఈమెను విడిచిపుచ్చుతాను," అని ఇంద్రుడు సమాధానం చెప్పాడు.

"ఈమె గర్భాన ఉన్నవాడు గొప్ప హరి భక్తుడు," అని నారదుడు చెప్పిన మీదట ఇంద్రు డామెను విడిచిపెట్టాడు. నారదు డామెను తన ఆశ్రమానికి తీసుకు పోయి అక్కడ ఆమెకు తత్త్వోపదేశం చేశాడు. లీలావతి గర్భంలో ఉన్న శిశువు కూడా ఆ తత్త్వాన్ని గ్రహించింది.

ఆ శిశువే ప్రహ్లాదుడు. హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడితో సహా నలుగురు కొడుకులు. మిగిలినవారి పేర్లు అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు. వారిలో ప్రహ్లాదుడు జగత్ప్రసిద్ధుడు. అతను శీలవంతుడు, శాంత వినయ దయాదిగుణాలు గలవాడు, అసుర లక్షణా లేవీ లేనివాడు. అన్నిటిని మించి అతనికి దైవభక్తి పుట్టుకతోనే వచ్చింది. ఆడుకుంటున్నా, తింటున్నా, తాగుతున్నా, నిద్రిస్తున్నా అతని మనసు హరి పైనే ఉండేది. హరి చింతలో అస్త మానమూ మునిగి తేలుతూ ప్రహ్లాదుడు ఏదో పాడుకునేవాడు, ఒకప్పుడు నృత్యం చేసేవాడు, ఎవరో పిలిచినట్టుగా పలికేవాడు, ఉన్నట్టుండి కంట నీరుపెట్టుకునే

అట్ట చివరి బొమ్మ



వాడు, ఒకప్పుడు మౌనంగా ఉండి పోయేవాడు.

రాక్షసులకు గురువైన శుక్రుడికి చండుడూ, అమర్కుడూ అని ఇద్దరు కొడుకు లుండేవారు.

వారు హిరణ్యకశిపుని ఇంటనే ఉండి, ఇతర పిల్లలతోబాటు ప్రహ్లాదుడి చేత కూడా రాజ నీతి చదివించారు.

ప్రహ్లాదుడు గురువులు చెప్పినది చదువు కున్నాడన్న మాటే గాని, ఆ చదువులో అతనికి ఏమీ నమ్మకం లేదు.

ఒకనాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి ఒళ్ళో కూచోబెట్టుకుని, "నీవు చదువు కుంటున్న విషయాలలో నీకు ఉత్తమంగా తోచినదేమిటో చెప్పు," అన్నాడు.

దానికి ప్రహ్లాదుడు, "నాన్నా, భ్రమ జనితమైన అహంకారంతో అరాటపడే ప్రాణులు చీకటి బావి లాటి ఇంటిని వదిలి పెట్టి ఏ అడవికో వెళ్ళి హరిధ్యానం చేసు కోవటమే నాకు అన్నిటికన్న ఉత్తమంగా తోస్తున్నది," అన్నాడు.

హిరణ్యకశిపుడు గట్టిగా నవ్వి, "పిల్లల మనసు ఎటుపడితే అటు సులువుగా తిరుగు తుంది! ఎవరో హరి భక్తులు రహస్యంగా వీడి బుద్ధిని మార్చేస్తున్నారు. అలాటి దేమి జరగకుండా వీడికి విద్యాబోధ చెయ్యండి," అని గురువులను హెచ్చరించాడు.

చండామర్కులు ప్రహ్లాదుణ్ణి విద్యా గృహానికి తీసుకుపోయి, మృదువుగా, "బాబూ, నీవు చాలా బుద్ధిమంతుడవు. అబద్ధం ఆడకుండా చెప్పు, నీ కిలాటి ఆలోచనలు ఎవరైనా చెబుతున్నారా? లేక నీకే కలుగుతున్నాయా? మిగిలిన పిల్లలు ఇలాటి మాట చెప్పరూ అనరే?" అని అడిగారు.

"భగవంతుడు కల్పించిన మాయచేతనే తన, పర అనే భేదభావం కలుగుతుంది. ఈ భ్రమ బ్రహ్మ అంతటి వాణ్ణికూడా బాధి స్తుందంటే మామూలు మనుషుల సంగతి

చెప్పే దేమిటి? అయస్కాంతం ఇనుమును లాగినట్టుగా హరి నా మనస్సును అస్తమానమూ ఆకర్షిస్తున్న కారణం చేతనే మీరు చెప్పే చదువులకూ, నాకు కలిగే భావాలకూ భేదం ఉంటున్నది," అని ప్రహ్లాదుడు బదులు చెప్పాడు.

"ఓరి దుర్మతీ! మా కపఖ్యాతి తేవటానికి నువ్వెక్కడ దాపరించావురా! చందనవనం లాంటి దైత్యవంశానికి గొడ్డలి అయిన ఆ విష్ణుమూర్తికి కర్రలాగా పుట్టుకొస్తివే! ఏదిరా చిత్తం?" అని గురువు లిద్దరూ ప్రహ్లాదుణ్ణి భయపెట్టి విద్యాబోధ సాగించారు.

వారతనికి ధర్మార్థకామాలను గురించి చదివించి, సామదానభేద దండాలనే చతురోపాయాలు అతనికి బాగా వచ్చాయని తేలినమీదట, నలుగుపెట్టి స్నానం చేయించి, మృష్టాన్న భోజనం పెట్టించి, హిరణ్యకశిపుడి వద్దకు తీసుకుపోయారు.

హిరణ్యకశిపుడు కొడుకును ఒళ్ళోకి తీసుకుని, లాలించి, వెనకటిలాగా, "బాబూ, నీవు చదివిన దానిలో నీకు బాగా నచ్చిన అంశ మేమిటి? ఉత్తమంగా తోచిన దేమిటి?" అని అడిగాడు.

దానికి ప్రహ్లాదుడు, "హరిశ్రవణమూ, కీర్తనమూ, స్మరణమూ, పాదసేవనమూ,



అర్చనమూ, వందనమూ, దాస్యమూ, సఖ్యమూ, ఆత్మసమర్పణమూ అనే తొమ్మిది విధాల భక్తియోగం ఆచరించటమే చదువులన్నిటిలోకీ మేలైనదని నా నమ్మకం," అన్నాడు.

హిరణ్యకశిపుడు కోపోద్రేకంతో, "బ్రాహ్మణాధములారా, నేనంటే అంత అలక్ష్యమా? కుర్రవాడికి మీరు నేర్పే విద్య ఇదా?" అని గర్జించాడు.

"మహారాజా, ఆగ్రహించవద్దు. వీడు చెప్పే విషయాలు మేము నేర్పినవి కావు, ఇతరులు చెప్పినవి కావు. అవి వాడికి పుట్టుకతోనే వచ్చి ఉండాలి. మా తప్పు ఇందులో ఏమీ లేదు," అని గురువులు విన్నవించారు.

చండామర్కులు యిలా చెప్పగానే హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడితో, "దుర్మార్గుడా, గురువులు చెప్పకుండా నీకి ఉద్దేశాలు ఎలా కలిగాయిరా?" అన్నాడు.

"ఇంద్రియాలకు లోబడి సంసారసాగరంలో మునిగి తేలే వారికి హరిభక్తి దానంతట అదిగాగాని, ఇతరులు చెబితేగాని కలిగేది కాదు," అని ప్రహ్లాదుడు తండ్రికి సమాధానం చెప్పాడు.

ఈ మాట వింటూనే హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి తన తొడ మీది నుంచి కిందికి తోసేసి, తన భటులతో, "వీణ్ణి నా ఎదురుగా లేకుండా తీసుకుపోయి చంపెయ్యండి. తన పినతండ్రిని చంపిన విష్ణువు అడుగులకు మడుగులొత్తే వీడు నా తమ్ముణ్ణి చంపిన వాడి కిందనే లెక్క. అయిదేళ్ళకే తల్లిదండ్రులకు శత్రువైన వీడు ఆ హరి కోసం ఏం చేసినా చెయ్యగలడు! నాకు పుట్టితేనేం గనక? శరీరంలో పుట్టిన రోగాన్ని నాశనం చేసుకోమా? కుళ్ళిపోయిన అంగాన్ని ఖండించమా? విషం యిచ్చిగాని, మరొక విధంగా గాని వీణ్ణి చంపెయ్యండి!" అన్నాడు. (ఇంకా వుంది)





# ప్రహ్లాదుడు

## 3

హిరణ్యకశిపుడి అనతిపై భయంకరులైన రాక్షసులు ప్రహ్లాదుణ్ణి శూలాలతో పొడిచారు. పెద్ద ఏనుగుల చేత తొక్కించారు. పాముల చేత కరిపించారు. మారణ హోమప్రయోగాలు చేశారు. కొండల మీది నుంచి తోయించారు. కృత్రిమంగా పిడుగులు కూడా మీద పడేలాగు చేశారు. ఎన్నిచేసినా, నేలలో పూడ్చి పెట్టినా, విషం పెట్టినా కూడా ప్రహ్లాదుడు చెక్కుచెదరలేదు. బ్రహ్మదేవుడు హిరణ్యకశిపుడి కిచ్చిన వరాలన్నీ ప్రహ్లాదుడికి దక్కినట్టయింది.

తన ప్రయత్నాలన్నీ వ్యర్థం కావటం చూసి హిరణ్యకశిపుడికి ఒక వింత భయం పట్టుకున్నది. కావటానికి పసివాడే గాని ప్రహ్లాదుడిలో ఏదో శక్తి ఉన్నది. వాడికి భయం కూడా లేదు. వాడితోటి పగ తన చావుకు దారి తీస్తుందా అన్న సంశయం హిరణ్యకశిపుడి మెదడులో తల ఎత్తింది. ఈ విధంగా తల వంచుకుని ఆలోచిస్తూ చింతాక్రాంతుడై హిరణ్యకశిపుడు కూర్చుని ఉండగా, చండామార్కులు అతని వద్దకు వచ్చి, "మూడు లోకాలనూ జయించిన మీ కెందుకు విచారం? చిన్నపిల్లలకు గుణదోషాలు తెలియవు. అందుచేత ప్రహ్లాదుడి బుద్ధులను గురించి విచారించ నవసరం లేదు. శుక్రాచార్యులవారు వచ్చిన అనంతరం ఆయన ప్రభావంచేత కుర్రవాడి బుద్ధి మారవచ్చు," అన్నారు.

"సరే, ప్రస్తుతానికి మీరు వాడికి రాజధర్మాలూ, గృహస్థధర్మాలూ నేర్పుతూ ఉండండి," అని హిరణ్యకశిపుడు చండామార్కులతో అన్నాడు. ఆ ప్రకారమే వారు ప్రహ్లాదుడికి పూర్వంలాగే చదువు చెప్పుతూ వచ్చారు. కాని తత్వజ్ఞానం తల కెక్కిన

అట్ట చివరి బొమ్మ

ప్రహ్లాదుడి కి చదువు ఎంత మాత్రమూ నచ్చలేదు. తనతో కలిసి చదువుకునే పిల్లలు తనను ఆటలకు పిలిచినప్పుడు ప్రహ్లాదుడు వారికి కూడా తత్వబోధచేసి, భగవంతుడొక్కడే సత్యమనీ, మిగిలినవన్నీ బాధలను కలిగించే భ్రమలు మాత్రమేననీ, ఈ తత్వోపదేశం నారదుడు తన తల్లికి చేయగా తాను విన్నాననీ చెప్పాడు. అతని ప్రభావంతో మిగిలిన రాక్షస బాలులు కూడా హరి ధ్యానంలో పడ్డారు. ఇది చూసి కంగారు పడి చండామర్కులు హిరణ్యకశిపుడితో ప్రహ్లాదుడు చేస్తున్న పని గురించి చెప్పారు. తన కొడుకును తానే చంపటానికి హిరణ్యకశిపుడు నిశ్చయించుకున్నాడు. అతను ప్రహ్లాదుణ్ణి పిలిపించి, చేతులు మోడ్చి వినయంగా నిలబడి ఉన్న ఆ కుర్రవాడితో, ''ఓరీ నీతి మాలినవాడా! ఏం చూసుకుని నా ఆజ్ఞను ధిక్కరిస్తున్నావురా? నా ఆజ్ఞ అంటే మూడు లోకాలూ గడగడలాడతాయే!'' అన్నాడు.

''మహారాజా, నీకేమిటి, నాకేమిటి? అందరికీ బలం ఆ పరమాత్ముడే. నీవు రాక్షసభావం వదిలిపెట్టి సౌమ్యుడివికా. అంతశ్శత్రువులైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాల నారింటినీ గెలవకుండా లోకాలన్నిటినీ జయించానంటే ప్రయోజనమేమిటి?'' అని ప్రహ్లాదుడు జవాబిచ్చాడు.





"మూఢుడా, నీది చావు తెలివిలాగుంది. నేనుగాక మరొక లోకేశ్వరుడున్నాడంటావా? వా డెక్కడ?" అని హిరణ్యకశిపు డన్నాడు. లోకేశ్వరు డంతటా ఉన్నాడని ప్రహ్లాదుడు చెప్పాడు. "అయితే ఈ స్తంభంలో కన బడడేం?" అని హిరణ్యకశిపుడు కత్తి దూసి ప్రహ్లాదుణ్ణి చంపటానికి సింహాసనం నుంచి దివాలున లేస్తూ సభా స్తంభాన్ని తన పిడికిలి బలంతో ఒక్క దెబ్బ కొట్టాడు.

వెంటనే భూమ్యాకాశాలు బద్దలయినట్టు భయంకరమైన చప్పుడయింది. అది బ్రహ్మ మొదలైన వాళ్ళు కూడా విన్నారుగాని హిరణ్యకశిపుడు చెవిన పెట్టలేదు. కొడుకును ఎలా చంపటమా అని తటపటాయిస్తూ అతను అటూ ఇటూ తిరిగాడు.

అంతలోనే అతనికి స్తంభంలో నుంచి పుట్టిన భయంకరమైన వింత ఆకారం కన బడింది. అది మృగమూ కాదు, మనిషీ కాదు. దానికి భయంకరమైన కోరలూ, కత్తి లాటి నాలుకా ఉన్నాయి. పసుపు పచ్చని రంగుతో కళ్ళు క్రూరంగా మెరుస్తున్నాయి. మెడ కురుచగానూ, బాగా కొవ్వి ఉన్నది. శరీరం నిండా తెల్లని రోమాలున్నాయి. ఆయుధాలలాటి గోళ్ళున్నాయి.

అది మహావిష్ణువు హిరణ్యకశిపును చంప టాని కెత్తిన నృసింహావతారం.



"మాయావి అయిన విష్ణువు నన్ను చంపటానికి ఈ రూపంలో వచ్చి ఉంటాడు. అయినా నన్నితనేం చెయ్యగలడు?" అనుకుని హిరణ్యకశిపుడు చేత గద పట్టుకుని నృసింహుడి పైకి పెడబొబ్బ పెడుతూ వెళ్ళాడు. నృసింహుడు అతన్ని, గరుత్మంతుడు పామును పట్టినట్టుగా పట్టాడు. అయితే హిరణ్యకశిపుడు పాము జారినట్టుగానే ఆ పట్టు తప్పించుకున్నాడు. తప్పించుకుని ఆ హిరణ్యకశిపుడు, ఆ నృసింహుడు తన బలానికి భయపడ్డా డనుకుని, కత్తి డాలూ పట్టుకుని నృసింహుడితో యుద్ధానికి తలపడ్డాడు. వెంటనే అతన్ని నృసింహుడు ఒడిసి పట్టుకున్నాడు. ఆయన కాంతికి హిరణ్యకశిపుడు ఏమీ చూడలేక కళ్ళు మూసుకుని తప్పించుకు పోజూశాడు. కాని అది సాధ్యం కాలేదు.

నృసింహుడు హిరణ్యకశిపుణ్ణి, పగలూ రాత్రీ కాని సంధ్యాసమయంలో, తన తొడ మీద పెట్టి, గోళ్ళతో అవలీలగా చీల్చి చంపేశాడు. తరువాత కొందరు రాక్షసులు తన పైకి ఆయుధాలతో రాగా వారిని కూడా చంపి, ఇక తనను ప్రతిఘటించే వారెవరూ లేకపోయే సరికి వెళ్ళి సింహాసనం మీద కూర్చున్నాడు. ఆయన ఆకారం అత్యంత భయానకంగా ఉన్నది.

అక్కడికి బ్రహ్మ మొదలుగా గల దేవత లంతా చేరారు. లోకకంటకుడైన హిరణ్యకశిపుణ్ణి చంపినందుకు ఆయనను స్తుతించారు. కాని ఆయనలో సౌమ్యం ఏర్పడలేదు. అప్పుడు బ్రహ్మ ప్రహ్లాదుణ్ణి పిలిచి నృసింహుణ్ణి శాంతింప చెయ్యమన్నాడు.

ప్రహ్లాదుడు ధైర్యంగా ఆ నృసింహుణ్ణి సమీపించి, ఆయనను స్తుతించి ప్రశాంతుణ్ణి చేశాడు.

తరువాత ప్రహ్లాదుడు తన తండ్రికి ఉత్తర క్రియలు జరిపి తానే రాజై రాజ్య పాలన చేశాడు. —(ఇంకా వుంది)





# ప్రహ్లాదుడు

## 4

ప్రహ్లాదుడు దేవి అనే ఆమెను పెళ్ళాడి, ఆమెకు ఆయుష్మంతుడు, శిబి, విరోచనుడు, కుంభుడు, నికుంభుడు అనే కొడుకులను కన్నాడు. వీరిలో ప్రసిద్ధుడు విరోచనుడు. శిబి అనే పురాణ ప్రసిద్ధుడొకడున్నాడుగాని, అతను ప్రహ్లాదుడి కొడుకు కాదు, ఉశీనరుడి కుమారుడు; అతని తల్లి దేవి కాదు, మాధవి.

నృసింహమూర్తి చేత హిరణ్యకశిపుడు చచ్చిపోయిన అనంతరం ప్రహ్లాదుడి జీవితానికి సంబంధించిన అనేక ఘట్టాలు మనకు పురాణాలలో కానవస్తాయి.

తాను రాజుగా ఉన్నప్పుడు ప్రహ్లాదుడికి కూడా స్వర్గాన్ని జయించాలనే కోరిక పుట్టుకొచ్చింది. అతను దేవతలతో యుద్ధం చేసి ఓడిపోయాడు! మరొక సందర్భంలో అతను విష్ణుభక్తిని కోల్పోయి, విష్ణువుతో యుద్ధానికి కూడా పూనుకున్నాడు. అది జరగటానికి కారణం: ఒకసారి ప్రహ్లాదుడు ఎవరో మునిని అవమానించగా ఆ ముని అతన్ని శపించాడు. అయితే విష్ణువుతో పోరాటం తటస్థపడిన మీదట ప్రహ్లాదుడికి జ్ఞానోదయమై, అతను తిరిగి విష్ణు భక్తుడయాడు.

చ్యవనమహాముని ఏ నదిలోనో స్నానం చేస్తూ సుడి గుండంలో చిక్కుకుని పాతాళానికి దిగిపోయాడు. అప్పు డక్కడ ఉన్న ప్రహ్లాదుడు ఆయనను గౌరవించి, ఆయన ద్వారా తీర్థయాత్రల మహిమలు తెలుసుకున్నాడు. తనకు కూడా తీర్థాలు సేవించాలనే బుద్ధి పుట్టి అతను చ్యవన మహాముని వెంట సపరివారంగా బయలుదేరి తీర్థయాత్రలు చేయసాగాడు. ఒక తీర్థంలో అతనికి తపస్సు చేసుకుంటున్న నరనారాయణులు కనిపించారు. వారి ముందు



అస్త్రాలున్నాయి. అది చూసి ప్రహ్లాదుడు, "వీరు దొంగ మునులలాగా ఉన్నారే! …ైన మునులైతే వీరికి అస్త్రాలతో ఏం …?" అన్నాడు.

ఆ మాటలకు నరనారాయణులు అలిగి, ప్రహ్లాదుడితో యుద్ధం చేసి ఓడించారు. ఓడిపోయిన ప్రహ్లాదుడు విష్ణువును ప్రార్థించగా విష్ణువు ప్రత్యక్షమై, "ఈ నరనారాయణులు ఎవరో కాదు నా అంశన పుట్టిన వారే," అని చెప్పాడు.

మరొకసారి ప్రహ్లాదుడి కొడుకు విరోచనుడనే వాడూ, అంగిరసు డనే బ్రాహ్మణుని కుమారుడు సుధన్వు డనే వాడూ ఒకే కన్యను వరించి పెళ్ళాడ గోరారు. ఆ సందర్భంలో వారు తమ గుణగణాల విషయంలో పోటీపడి, తీర్పు చెప్ప మని ప్రహ్లాదుడి వద్దకే వచ్చారు. ప్రహ్లాదుడు వారిద్దరిలో ఎవరు అధికులో చెప్పటానికి బిడియపడి, వారిని కశ్యపుడి వద్దకు వెళ్ళ మని సలహా ఇచ్చాడు.

"నిన్ను న్యాయం చెప్పమని కోరుతూంటే, నీవు మమ్మల్ని మరెవరి దగ్గిరికో పొమ్మంటావేమిటి? రాజుగా నీవు మాలో ఎవరు అధికులో నిష్పక్షపాతంగా చెప్పు, అధర్మం అవలంబించావంటే నీకు చేటు తప్పదు," అన్నాడు సుధన్వుడు.

ఈ మాట విని ప్రహ్లాదుడు, విరోచనుడు తన కొడుకే అయినప్పటికీ, అతని కన్న సుధన్వుడే ఎక్కువని న్యాయంగా తీర్పు చెప్పాడు.

విరోచనుడి కొడుకే బలి. ప్రహ్లాదుడు స్వర్గాన్ని జయించబోయి, దేవతలతో ఓడిపోయిన పిమ్మట తాను తపస్సు చేసుకో బోతూ బలికే రాజ్యాభిషేకం చేశాడు. ఒకసారి బలి తన తాత అయిన ప్రహ్లాదుణ్ణి, "ఒకప్పుడు మన దైత్యులు బల వీర్య సంపన్నులై ఉండేవారు కదా, రానురాను వారి బలం క్షీణిస్తున్నది. ఇందుకు కారణమేమిటి?" అని అడిగాడు.

దానికి ప్రహ్లాదుడు, "విష్ణువుయొక్క ప్రభావమే అందుకు కారణం," అన్నాడు.

"విష్ణువు అంత గొప్పవాడా? అతన్ని జయించ గల వీరులు మనలో లేరా?" అని బలి అన్నాడు.

"ఓరీ, అలా అన్నందుకు ఆ విష్ణువు నిశ్చయంగా నీ నెత్తి అణుస్తాడు!" అన్నాడు ప్రహ్లాదుడు కోపంతో. ప్రహ్లాదు డన్న ఈ మాట అక్షరాలా నిజమయింది.

బలి గొప్ప చక్రవర్తులలో ఒకడు. అతను గొప్ప ధార్మికుడు, ఆడి తప్పనివాడు. అతనికి అశన అనే భార్యయందు రత్నమాల అనే కూతురూ, బాణుడూ, ధృతరాష్ట్రుడూ, నికుంభనాభుడూ, విభీషణుడూ అనే కుమారులూ కలిగారు.

దేవతలు బలిని శాంతంగా రాజ్యం చేసుకోనివ్వక, చీటికి మాటికీ అడ్డు తగులుతూ బాధించసాగారు. చూసిచూసి, బలి ఇంద్రలోకం మీదికి దండెత్తి వెళ్ళాడు. బలిని ఎదుర్కొనటానికి ఇంద్రుడు భయపడి, తన గురువైన బృహస్పతిని సలహా అడిగితే, "బలిని జయించటం నీవల్ల కాదు. అందుకు నీకు విష్ణువు సహాయం ఉండాలి," అని బృహస్పతి అన్నాడు.

బలి మూడు లోకాలూ జయించి రాజ్యమేలుతుంటే, దేవతలు బ్రహ్మతో మొర



పెట్టుకున్నారు. బ్రహ్మ వారిని వెంటబెట్టుకుని విష్ణుమూర్తి వద్దకు వెళ్ళాడు. బలిని పదభ్రష్టుణ్ణి చేస్తానని విష్ణువు దేవతలకు మాట ఇచ్చి, తాను వామనావతార మెత్తాడు. అతను మరుగుజ్జు రూపంలో కశ్యపుడికి అదితి గర్భాన పుట్టి, ఉపనయనం కాగానే భిక్షాటన చేస్తూ, కొన్నాళ్ళకు బలిచక్రవర్తి వద్దకు వచ్చాడు.

బలిచక్రవర్తి ఆ వటువును చూసి, "ఏం కావాలో కోరుకో," అన్నాడు. వామనుడు తనకు మూడడుగుల భూమి చాలు నన్నాడు. బలిచక్రవర్తి అందుకు సరే నన్నాడు. కాని అతని గురువైన శుక్రుడు మోసం తెలుసుకుని, "ఈ వటుడికి మూడడుగుల భూమి ఇవ్వవద్దు," అని సలహా చెప్పాడు. అది తప్పని బలి అందుకు ఒప్పుకోలేదు.

బలిచక్రవర్తి వామనుడు కోరిన భూమిని ధారాదత్తం చేసేటప్పుడు శుక్రుడు కీటక రూపంలో పాత్రలోని కొమ్ముకు అడ్డుపడి జలధార వెలుపడకుండా చేశాడు. వామనుడొక పుల్లతో కొమ్ములోకి పొడవగా శుక్రుడి కన్నొకటి పోయింది.

ఆ తరువాత బలి వామనుడికి మూడడుగుల భూమి ధారపోశాడు.

వెంటనే వామనుడు విశ్వరూపి అయి ఒక అడుగుతో భూమినీ, రెండవ అడుగుతో ఆకాశాన్నీ ఆక్రమించి, "మూడో అడుగు ఎక్కడ పెట్టను?" అన్నాడు.

"నా తలపైన పెట్టు," అని బలి తల వంచాడు.

అప్పుడు ప్రహ్లాదుడు వచ్చి, "వీడు నీతి పరుడు. వీణ్ణి శిక్షించవద్దు," అని వామనుణ్ణి వేడుకున్నాడు. వామనుడు బలిని చంపక, అతనిని పాతాళలోకానికి పంపి, అక్కడ రాజుగా చేసి, బలి ఆజ్ఞ నిర్వర్తించని రాక్షసులు దండింపబడతారని ప్రకటించటమేగాక, తానే స్వయంగా బలికి ద్వారపాలకుడు కూడా అయాడు.



